గురునియొక్క సంబంధవీక్షణములవలన సంతానము రాజ్యవృద్ధి ధనలాభము రాజానుగ్రహము కార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వస్త్రభూషణ సంగ్రహం
వాహనాదివివృద్ధించ స్వస్త్రీసౌఖ్యం తథైవచ
శనినాసంయుతేదృష్టే దాసీదాస సుతక్షయం
పశుధాన్యవినాశంచ నీచసేవాం తథైవచ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రములు అలంకారములు వీటియొక్కలాభము వాహనసౌఖ్యము కళత్ర సౌఖ్యమును గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజననష్ట ము సంతాననష్టము పశునష్టము ధాన్యహాని నీచసేవయు గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యే లాభగేపివా
శుభగ్రహయుతే వాపిధనభూషణ లాభవాక్
శుభశోభన సంప్రాప్తిం చందనాది మహోత్సవం
నరవాహన యోగంచ రాజ్యలాభం మహత్సుఖం
విద్యావినోదగోష్టంచ నానామూలార్ధనాగమం॥

దశానాథునిలగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తు డైయున్నయెడల ధనము అలంకారములు వీనియొక్క లాభ

మును శుభశోభనములు జరుగుటయు సంతానసౌఖ్యము నర వాహనయోగమును రాజ్యలాభము విశేషసౌఖ్యము విద్యా వినోదగోష్టి అనేకవిథములుగా ధనలాభమును గలుగును.

శ్లో॥ దాయేశాత్ష ష్ఠ రంధ్రేవావ్యయేవా పాపసంయుతే
అపకీర్తిసంభవంచైవ రోగబాధాభవిష్యతి
విదేశవాససంప్రాప్తిం బంధుద్వేష మవాప్నుయాత్
యత్నకార్య వినాశంచ హ్యాకాలే భోజనంవదేత్॥

దశానాథునిలగాయతు చంద్రుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపగ్రహయుక్తుడైయున్నయెడల అపకీర్తి రోగము ద్వీపాంతరవాసము బంధుద్వేషము కార్యనాశనము అకాల భోజనము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్తే వాహ్యాపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాసాహస్రి కంజపేత్
రజతాశ్వప్రదానేన హ్యాయురారోగ్యవర్ధనం॥

ద్వితీయసప్తమములయందు చంద్రుడున్నయెడల అప మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై దుర్గా సహస్రనామ జపమును వెండితో చేయబడిన అశ్వదానమును చేసినయెడల ఆయుర్వృద్ధి గలుగును.

కేతువులో కుజభుక్తి మా 4 రో 27

శ్లో॥ కేతోరంతర్గతే భౌమే తృతీయే షష్టలాభగే
స్వోచ్ఛేవాశుభరాశిస్థే శుభగ్రహాయుతేక్షి తే

భ్రాతృసౌఖ్యం మనోత్సాహం స్వార్జితక్షేత్రవర్ధనం
భోజనాంబరసౌఖ్యంచ కృషిభూషణ వాహనం॥

కేతుదశలో కుజభుక్తియందు కుజుడు తృతీయషష్ఠలాభములయందుగాని ఉచ్చయందుగాని శుభరాశియందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల భ్రాతృసౌఖ్యము మనోత్సాహము స్వార్జితమువలన భూసంపాదనయు భోజనసౌఖ్యము వస్త్రసౌఖ్యము వ్యవసాయలాభము వాహనభూషణములు యివిగలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే భౌమేనీచ కేంద్రత్రికోణగే
కురాజదస్యువ్యాళేభ్యో మృత్యుబంధనమేవవా
విపదం పరదారేభ్యో మాతృరోగ మపస్మృతిం
వమీవిరోచనవ్యాధిం కష్టంనష్టంచ సాహసం॥

కుజుడు నీచయందుగాని కేంద్రత్రికోణములయందుగాని యున్నయెడల దుష్టునివలన పొందబడిన ధనముగలవాడును సర్పభయముగలవాడును మృత్యుభయమును బంధనప్రాప్తియు పరస్త్రీలవలన ఆపత్తును నేత్రరోగమును కలరారోగము విశేషకష్టము విశేషధనవ్యయమున్ను గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే జ్వరస్ఫోట పరిణాద్భయం
అరణ్యపథసంచారం హ్యపక్వాన్నాదిభోజనం॥
చంద్రేణసంయుతేదృష్టే మాతృవంశ వినాశనం
నేత్రబాధా మనస్తాపం మహారోగ వివృద్ధిదం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన జ్వరము స్ఫోటకము వ్రణబాధ వీనివలన భయము అరణ్యమునందు సంచరించుట అపక్వపదార్థభోజనమును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశనష్టము నేత్రబాధ మనోవ్యాకులత విశేషరోగవృద్ధి యివి గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బంధువృద్ధిశ్చజాయతే
క్వచిత్కలహ సంతాపం దూరవార్తాగమం వదేత్
గురుణాసంయుతేదృష్టె రోగవిస్మృతిమాప్నుయాత్
విశేషధనహానిశ్చ శత్రుపీడా తథైవచ॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువృద్ధి స్వల్పకలహము సంతాపము దూరవార్తా శ్రవణము యివి గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన రోగభయము విశేషముగా ధననష్టము శత్రుములవలన భయము యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే యానవాహనవృద్ధిదం
వివాహాదిసుసౌఖ్యంచ వస్త్రాభరణసంగ్రహం॥
శనినాకలహంచైవ ధననాశం తథైవచ
అన్యస్థల ప్రవాసంచ సమానజననాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన పల్లకీవాహ

నము మొదలగువానివృద్ధి వివాహసౌఖ్యము వస్త్రాభరణప్రాప్తి యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన ధననాశనము అన్యస్థలప్రవాసము సమానజననాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రరాశిస్థే వ్యయేవా మృత్యురాశిగే
పాపగ్రహయుతేనాపి గృహారామ వినాశనం
కుస్త్రీకలాపం విఫలం కృషిమూలాద్ధనక్షయం
చోరాగ్ని శత్రుబాధాచ సమానజననాశనం
అకస్మాత్కలహంచైవ వ్యవహారే భయంతథా
విషూచికాది బాధాంచ సర్వకార్య వినాశనం॥

దశానాథునిలగాయతు కేంద్రమందుగాని వ్యయమందుగాని ద్వితీయసప్తమములయందుగాని పాపగ్రహయుతుడై కుజుడున్నయెడల గృహములు తోటలు వీనియొక్క నాసమును దుర్మార్గస్త్రీలతో కలహమును వ్యవసాయమూలకముగా ధనవ్యయమున్ను దొంగలవల్లనుంచిగాని అగ్నివల్లనుంచిగాని పీడయు సమానమనుజునియొక్క నాశనమును అకస్మాత్తుగా కలహమున్ను వ్యవహారభయము విషూచికాదిబాధయు సమస్తకార్యములయొక్క నాశనమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠగేవాపి తృతీయే లాభగేపివా
పంచమే నవమేవాపి శుభగ్రహయుతేపివా
నానామూలాద్ధనప్రాప్తిం ఋణాద్రవ్యాయతింతథా
పురాధిపతిసన్మానం సర్వకార్యార్థ సిద్ధిదం॥

దశానాథుని లగాయతు కుజుడు షష్టమమందుగాని తృతీయలాభములయందుగాని పంచమనవమములయందుగాని శుభగ్రహయుతుడై యున్న యెడల అనేకవిధములుగా ధనరాబడియు ఋణములు వసూలు అగుటయు రాజసన్మానమును సర్వకార్యములయందు జయమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా దేహతాపం జ్వరాదికం
దారాపీడా మహాక్లేశ మపమృత్యుభయంతథా
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్
తైలకుంభప్రదానేనసుఖమారోగ్య మేష్యతి॥

ద్వితీయసప్తమములయందు కుజుడున్నయెడల తాపజ్వరము కళత్రపీడ విశేషదుఃఖము అపమృత్యుభయము గలుగును. ఈదోషము పోవుటకై సుబ్రహ్మణ్యేశ్వరజపమును తైలకుంభదానమును చేసినయెడల శరీరసౌఖ్యము గలుగును.

కేతుదశలో రాహుభుక్తి సం 1 మాం 0 రో 18

శ్లో॥ కేతోరంతర్గతే రాహౌతృతీయే షష్ఠలాభగే
ఉత్తమైస్సహసంవాసః స్త్రీపుత్రసుఖమేవచ
తీర్థస్నానం సాహసంచ స్వర్ణరత్నాదిభూషణం॥

రాహువు తృతీయమందుగాని షష్టలాభములయందుగాని యున్నయెడల ఉత్తమపురుషులతో సహవాసము స్త్రీపుత్రసౌఖ్యము తీర్థస్నానఫలము సాహసము స్వర్ణరత్నాదిభూషణములు యివిగలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే రాహౌవ్యయేవాష్టమసంస్థితే
కేంద్రాత్రికోణసంస్థేవా పాపగ్రహయుతేక్షితే
ఉద్యోగభంగం దేహార్తిం నీచవృత్త్యాను జీవనం
శత్రువృద్ధిర్విశేషంచ కారాగృహనివేశనం॥

రాహువు వ్యయమందుగాని అష్టమమందుగాని యున్నను కేంద్రత్రికోణములయందున్నను పాపగ్రహములతోఁగూడినను చూడబడినను ఉద్యోగభంగము దేహపీడ నీచవ్యాపారమువలన జీవనము శత్రువృద్ధియు కారాగృహప్రాప్తియును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే కలహం రాజవిగ్రహం
అధికారవినాశంచ శిరోభ్రమణమేవచ
శశినాసంయుతేదృష్టే మనః ఖేదం తథైవచ
చింతాశోకాదికలహం మాతృవంశ వినాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన కలహము రాజవిరోధము ఉద్యోగనష్టము శిరోభ్రమణము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మనోవ్యాకులత విచారము శోకము కలహము మాతృవంశనాశనము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే స్వదేహే శస్త్రపీడనం
సహోదర వినాశంచ గ్రహాణే రోగసంభవం
బుధేనసంయుతేదృష్టే వ్యవహారే ధనక్షయం
పూర్వబంధు వినాశంచ దుష్కర్మ నిరతోయదా॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రముచే దెబ్బతగులుటవలన బాధయు సోదరనష్టము గ్రహణిరోగము ను గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన వ్యవహారమందు ధననష్టము పూర్వబంధునాశనము నిత్యమున్ను దుష్కర్మములు చేయుటయు యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుపుత్రవినాశనం
స్వదేహే రోగబాధాచ ధననాశం తథైవచ
శుక్రేణసంయుతేదృష్టే సుఖశయ్యాదినాశనం
వస్త్రభూషణనాశంచ గర్భస్రావాది పీడనం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురువుపుత్రులు వీరియొక్క నాశనమును దేహమందు రోగబాధయు ధననాశనమును గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన శయ్యాసుఖము లేకపోవుటయు వస్త్రములు భూషణములు వీనియొక్క నాశనము గర్భస్రావరోగము యివిగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే నీచసేవా మహద్భయం
భృత్యమూలాత్స్థాననాశం సమానజననాశనం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన నీచులయొక్క సేవయు విశేషభయమున్ను సేవకులమూలముగా స్థాననష్టము సమానమనుజునియొక్క నష్టము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవారాహ్యపమృత్యుర్భవిష్యతి
మహాకూష్మాండ దానేనహ్యాయురారోగ్యవర్ధనం॥

ద్వితీయసప్తములయందు రాహువున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై పెద్దగుమ్మడికాయను దానముచేసినయెడల ఆయురారోగ్యవృద్ధిగలుగును.

కేతుదశలో గురుభుక్తి మా 11 రో 6

శ్లో॥ కేతోరంతర్గతే జీవేస్వోచ్చే వా కేంద్రకోణగే
ధనేవాలాభరాశిస్థే శుభగ్రహయుతే క్షితే
వివాహోభూమిలాభశ్చ శతృనాశశ్శివార్చనం
పుత్రోత్పత్తిశ్చ కీర్తిశ్చ రాజసన్మానవైభవం॥

గురుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ద్వితీయలాభములయందుగాని యున్నను శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల వివాహము భూలాభము శతృనాశనము శివార్చనము పుత్రోత్పత్తియు విశేషకీర్తియు రాజసన్మానము వైభవము గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతేజీవే షష్టేవాష్టమరిష్ఫగే
కర్మనాశంపదభ్రంశ మకస్మాత్కలహంవదేత్
మాతృనాశంతదీయంవా దారాపుత్రాదిపీడనం॥

గురుడు షష్ఠాష్టవ్యయముల యందున్నయెడల కర్మనాశము పదభ్రష్టత్వము అకస్మాత్తుగా కలహము మాతృనష్టము దారాపుత్రాదిపీడయు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పుత్రాణాంకలహంతథా
ధననాశంమానభంగ ముద్యోగచలనంతథా
చంద్రేణసంయుతేదృష్టే హ్యధికారాదిలాభవాన్
వాహనాభరణప్రాప్తిః బంధుసన్మానమేవచ॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పుత్రులతో కలహముధననాశనము మానభంగము ఉద్యోగభంగముగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన ఉద్యోగప్రాప్తి వాహనలాభము అలంకారప్రాప్తి బంధుసన్మానము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే తనుతాపంవినిర్దిశేత్
నానామూలాత్కలాపంచ చింతాశోకంతథైవచ
బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాదితత్పరః
ఋణద్రవ్యాయతిప్రాప్తి జీవనంసుఖదంభవేత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శరీరతాపము అనేకవైపులనుంచి చింతయు శోకమునుగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాసము బాకీలు వసూలగుటయు సుఖజీవనమును గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వేశ్యాస్త్రీనటసంకులం
కల్యాణాదిసుఖప్రాప్తిం టీకాగ్రంథాదిసంగ్రహం
శనినాసంయుతేదృష్టే దాసీదాసాదినిగ్రహం
సమానజననాశంచ ధాన్యనాశంతథైవచ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన భోగమస్త్రీ

లతోపొందుట కళ్యాణము సౌఖ్యము తాత్పర్యసహితమైన గ్రంథమునుచదువుటయివిమొదలగుమంచిఫలములుగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజనములుయొక్క నష్టము సమానమనుజుని నష్టము ధాన్యనాశమునుగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్కేలాభగేపివా
శుభగ్రహయుతేవాపి ధనలాభంశుభప్రదం
శివదీక్షాఫలంసిద్ధిః దారాపుత్రాదిసౌఖ్యదం
యత్నకార్యార్థసిద్ధించ కృషిక్షేత్రవివృద్ధిదం
గోధనానిసమృద్ధించ గురుదేవసుదర్శనం॥

దశానాథునిలగాయతు గురుడు తృతీయలాభములయందుగాని కేంద్రకోణముల యందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల ధనలాభము శుభప్రదము శివదీక్షాఫలసిద్ధియు వ్యవసాయము భూమి వీనియొక్కవృద్ధి పశువులు ధనము వీనియొక్కలాభము గురునియొక్కయు దైవములయొక్కయు సందర్శనీయమును యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేనాపాపసంయుతే
ద్రవ్యనాశంమనఃఖేద మపకీర్తిభయంతథా
పుత్రదారావియోగంచ దుఃఖవ్యాధిభయంతథా
గురుద్వేషంస్థాననాశం పితృవంశవినాశనం॥

దశానాథుని లగాయతు గురుడు షష్ఠాష్టవ్యయముల యందున్నను పాపగ్రహములతో గలసినను ద్రవ్యనాశము

మనోవ్యాకులత అపకీర్తి భయము పుత్రదారావియోగము దుఃఖము వ్యాధిభయము గురుద్వేషము స్థానభ్రష్టత్వము పితృ వంశనము గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం తిలదానం ప్రకల్పయేత్ ॥

ద్వితీయసప్తమస్థానములయందు గురువున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై తిలదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

కేతుదశలో శనిభుక్తి సం 1 మా 1 రో 9

శ్లో॥ కేతోరంతర్గతే మందేతృతీయే షష్ఠలాభగే
దేవభూసురభక్తించ సుతదారవివర్ధనం
వస్త్రవాహనసౌఖ్యంచ పుత్రస్త్రీధనసంపదః॥

శని తృతీయషష్ఠలాభములయందున్నయెడల దేవబ్రాహ్మణభక్తియు పుత్రులయొక్కయు భార్యలయొక్కయు సౌఖ్యము వస్త్రములు వాహనములు వీనియొక్క లాభము స్త్రీపుత్ర ధనసంపత్తులు యివిగలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే మందేనీచేవాష్ట మరిప్పగే
కేంద్రేవాకోణసంస్థేతు పాపగ్రహయుతేక్షితే
గుహ్యరోగం విషార్తించ జ్వరవహ్నినృపాద్భయం
ఆత్మాప్తబంధుమరణం ఉద్యోగస్య వినాశనం
మనోదుఃఖం మహత్కష్టం స్థాననాశం ధనక్షయం॥

కేతుదశలో శనిభుక్తియందు శని నీచయందుగాని అష్ట

మనోవ్యాకులత అపకీర్తి భయము పుత్రదారావియోగము దుఃఖము వ్యాధిభయము గురుద్వేషము స్థానభ్రష్టత్వము పితృ వంశనము గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాప్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం తిలదానం ప్రకల్పయేత్॥

ద్వితీయసప్తమస్థానములయందు గురువున్నయెడల అప మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై తిలదా నమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

కేతుదశలో శనిభుక్తి సం 1 మా 1 రో 9

శ్లో॥ కేతోరంతర్గతే మందే తృతీయే షష్ఠలాభగే
దేవభూసురభక్తించ సుతదారవివర్ధనం
వస్త్రవాహనసౌఖ్యంచ పుత్రస్త్రీధనసంపదః॥

శని తృతీయషష్ఠలాభములయందున్నయెడల దేవబ్రా హ్మణభక్తియు పుత్రులయొక్కయు భార్యలయొక్కయు సౌఖ్య ము వస్త్రములు వాహనములు వీనియొక్క లాభము స్త్రీపుత్ర ధనసంపత్తులు యివిగలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే మందే నీచేవాష్టమరిప్పగే
కేంద్రేవాకోణసంస్థేతు పాపగ్రహాయుతేక్షితే
గుహ్యరోగం విషార్తించ జ్వరవహ్నినృపాద్భయం
ఆత్మాప్తబంధుమరణం ఉద్యోగస్య వినాశనం
మనోదుఃఖం మహత్కష్టం స్థాననాశం ధనక్షయం॥

కేతుదశలో శనిభుక్తియందు శని నీచయందుగాని అష్ట

మమందుగాని వ్యయమందుగాని కేంద్రకోణములయందుగాని పాపగ్రహములతో గలిసియున్న యెడల మూలరోగము విష మువలన బాధ జ్వరమువల్లను అగ్నివల్లను రాజులవలనను భయ ము మిక్కిలి అప్పుడగు బంధువునియొక్క మరణము ఉద్యోగ భ్రష్టత్వము దుఃఖము గొప్పకష్టము స్థాననష్టము ధనవ్యయ మునుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పితృబంధునాశనం
ఉద్యోగనాశనంచైవ ద్రవ్యనాశం మహద్భయం
శశినాసంయుతేదృష్టే మాతృవంశ వినాశనం
శిరోరోగాది బాధాచ సంతాపం కలహంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పితృనష్టము బంధు నాశనము ఉద్యోగనాశనము ధననష్టము విశేషభయమున్ను గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవం శనాశనము శిరోరోగము బాధ సంతాపము కలహమున్ను గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే భ్రాతృవంశ వినాశనం
యుద్ధేశతృభయంచైవ అగ్నిబాధా మనోవ్యథా
బుధేనసంయుతేదృష్టే బాంధవక్షయమావిశేత్
స్వస్థానవాశనంచైవ మిత్రబంధు విరోధకృత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన సోదరవంశన

ష్టము యుద్ధమందు శత్రుభయము అగ్నిబాధ మనోవ్యాకులత యు గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధుక్షయము స్వస్థానభ్రష్టత్వము మిత్రులయొక్క బంధువులయొక్కయు విరోధమున్ను గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రనాశం వినిర్దిశేత్
గురుద్వేషం ద్రవ్యనాశం నానాకార్య వినాశనం
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధునిగ్రహం
పరదారాదిగమనం ద్రవ్యనష్టంచ జాయతే॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రనాశనము గురువిరోధము ద్రవ్యనష్టము తలపెట్టినకార్యము లన్నియు నశించుట గలుగును. శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యము బంధునష్టము పరస్త్రీగమనము ద్రవ్యనష్టము మొదలగునవి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపి పశులాభం వినిర్దిశేత్
స్వస్త్రీసౌఖ్యం బంధువృద్ధింధనధాన్య వివృద్ధిదం
మిత్రప్రభువ శాత్సౌఖ్యం యుద్ధేశత్రువినాశనం
యత్నకార్య సుసిద్ధించ సర్వత్రారోగ్యమేవచ॥

దశానాథునిలగాయతు శని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల పశులాభము స్త్రీసౌఖ్యము బంధువృద్ధి ధనధాన్య

వృద్ధి మిత్రప్రభువువల్ల నుంచి సౌఖ్యము యుద్ధమందు శత్రునష్టము యత్నకార్యసిద్ధియు సమస్తబంధువులయొక్క ఆరోగ్యమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రే వావ్యయేవా పాపసంయుతే
వ్యాపారధననాశశ్చ సర్వధాన్యవ్యయోభవేత్
మిత్రప్రభు విరోధశ్చ స్వస్థాన చలనంభవేత్॥

దశానాథునిలగాయతు శని షష్ఠాష్టవ్యయములయందు పాపగ్రహసంబంధములు గలిగియున్నయెడల వ్యాపారమందు ధననష్టము ధాన్యనాశనము మిత్రప్రభువుయొక్క విరోధము స్థానచలనమును గలుగును.

కేతుదశలో బుధభుక్తి మా 11 రో 27

శ్లో॥ కేతోరంతర్గతే సౌమ్యే స్వోచ్చే వా కేంద్రకోణగే
ఆరోగ్య మతిసౌఖ్యంచ వాణిజ్యేన ధనాగమం
దారాపుత్రాది సౌఖ్యంచ పురాణశ్రవణాదికం॥

బుధుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని యున్నయెడల ఆరోగ్యమున్ను విశేషసౌఖ్యమున్ను వర్తకవ్యాపారమువలన ధనలాభము దారాపుత్రాదిసౌఖ్యము పురాణశ్రవణము గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే సౌమ్యే షష్ఠేవాష్టమరిష్ఫగే
విషార్తిం బంధువిద్వేషం కృషిగోభూమినాశనం
శత్రువృద్ధిర్విశేషంచ నిజాచార వివర్జితం॥

బుధునకు షష్ఠాష్టవ్యయములయందున్నయెడల విషము వలన భయము బంధువిరోధము వ్యవసాయనష్టము పశునష్టము భూనాశనము శత్రువృద్ధి ఆచారహీనమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే ఉద్యోగం లభతేధ్రువం
పుత్రమిత్రాదిసౌఖ్యంచ ధనధాన్యవివృద్ధిదం
శశినాసంయుతేదృష్టే మాతృబంధు వివృద్ధిదం
వస్త్రాభరణసంప్రాప్తి మాప్తబంధు ముఖాత్సుఖం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన ఉద్యోగసౌఖ్యము పుత్రమిత్రసౌఖ్యము ధనవృద్ధి ధాన్యవృద్ధి యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృసౌఖ్యము బంధువృద్ధి వస్త్రములు భూషణములు వీనియొక్క సంపాదన ముఖ్యుడగు బంధువునిమూలముగా సౌఖ్యమునుగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధే శత్రుభయంతథా
చోరాది విషబాధాచ చింతాశోకంతథైవచ
గురుణాసంయుతేదృష్టే సుతలాభోభవిష్యతి
ధనలాభం. దేహసౌఖ్యం మిత్రబంధువివృద్ధిదం

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శత్రుభయము దొంగలవల్లనుంచిన్ని విషమువల్లనుంచిన్ని భయము చింతయు విచారమును గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రలాభము ధనలాభము దేహసౌఖ్యము మిత్రసౌఖ్యము బంధువృద్ధి యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనంభూషణాన్వితం
వివాహశుభకార్యాణి గృహభూమ్యాదిలాభవాన్
శనినాసంయుతేదృష్టే బంధునాశంధనక్షయం
స్వభృత్యకలహంచైవ పశుధాన్యవినాశనం

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనము భూషణములు వీనియొక్కలాభము వివాహశుభకార్యములు జరుగుటయు గృహములు భూమివీటియొక్కలాభము యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
శుభగ్రహయుతేవాపి విద్యాలాభంధనాధికం
బంధుమిత్రవివృద్ధించ క్షేత్రలాభంతథైవచ
విష్ణుపూజాదిభక్తించ యత్నకార్యార్థసిద్ధిదం

దశానాథుని లగాయతు బుధుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభముల యందుగాని శుభగ్రహయుతుడైయున్నయెడల విద్యాలాభము ధనలాభము బంధువృద్ధి మిత్రవృద్ధి క్షేత్రలాభము విష్ణుపూజయు కార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ దాయేశాష్టమరాశిస్థే వ్యయేవాషష్ఠరాశిగే
పాపగ్రహయుతేవాపి మిత్రాణాంతువిరోధతా
నానామూలాద్ద్రవ్యహానిః పశునాశస్తథైవచ
అకస్మాత్కలహప్రాప్తిః పుష్పిణీస్త్రీసుసంగమః

దశానాథుని లగాయతు బుధుడు అష్టమమందుగాని

షష్ఠమమందుగాని వ్యయమందుగానియున్న పాపగ్రహముల తో గలిసినను మిత్రులతో విరోధము అనేకవిధములుగా ద్రవ్యనష్టము పశునాశనము అకస్మాత్తుగా కలహము రజస్వల స్త్రీతో సంభోగము యివి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యాప మృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృగదానేనశామ్యతి

ద్వితీయ సప్తమములయందు బుధుడున్నయెడల అప మృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై మృగదాన మును చేసినయెడల శాంతిగలుగును.

శుక్రదశలో శుక్రభుక్తి సంవె మా॥4

శ్లో॥ శుక్రస్యాంతర్గతేశుక్రే స్వోచ్చేవాకేంద్రకోణగే
గజాశ్వాందోళికాలాభం ఛత్రచామరసంయుతం
సువర్ణరత్నాభరణంనృత్త గీతమహోత్సవం
సంగీతమపిసాహిత్యం కవిత్వంక్రీడనంతథా
ఉల్లాసారోగ్యభాగ్యానితాంబూలవనితాసుఖం

శుక్రుడుఉచ్చయందుగాని కేంద్రకోణముల యందు గాని యున్నయెడల యీశుక్రభుక్తియందు ఏనుగగుర్రము పల్లకీమొదలగు వాహనసౌఖ్యములున్నూ నాట్యముసంగీతము సాహిత్యము కవిత్వముతాంబూలము స్త్రీసౌఖ్యముమొదలగు నవి గలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతేశుక్రే నీచేవష్టాష్టరిష్ఫగే
అనారోగ్యమ మాన్యాదం దారాపుత్రాది పీడనం

బంధు ద్వేషంపితు ర్నాశం స్వబంధుజననాశనం
ఉద్యోగభంగం క్లేశంచ ధర్మమూలాద్ధనవ్యయః

శుక్రదశలో శుక్రభుక్తియందు శుక్రుడు నీచయందు గాని షష్ఠాష్టవ్యయముల యందుగాని యున్న యెడల అనారోగ్యము అమర్యాద దారాపుత్రపీడ బంధువిరోధము పితృనష్టము బంధునాశనము ఉద్యోగభంగము దుఃఖము ధర్మమూలకముగా ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే నృపక్రోధాద్ధనక్షయం
సంచారంచశిరోరోగం పితృవర్గవినాశనం
చంద్రేణసంయుతేదృష్టే సుగంధంచసుభోజనం
శయ్యాసౌఖ్యం యానలాభం నటగాయకసంకులం

రవియొక్క సంబంధ వీక్షణములవలన రాజవిరోధము ధననష్టము సంచారమువలన శిరోబాధ పితృవర్గనాశనమును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన సుగంధములు భోజనసౌఖ్యము శయ్యాసౌఖ్యము వాహనసౌఖ్యము నటగాయకసౌఖ్యమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే భాతృణాంకలహంతథా
యత్నకార్యవినాశంచస్వప్రభోద్వేషసంగ్రహః
బుధేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిచింతనం
విద్యావినోదగోష్ఠించవణిగ్మూలాద్ధనాగమం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన సోదరులతో

కలహామున్నా కార్యనాశనము స్వపరిభువువల్లనుంచి విరోధ మును గలుగును.

బుధునియొక్క సంబంధమువలన వేదశాస్త్రవిచారణ యు విద్యావినోదగోష్ఠి వైశ్యులమూలకముగా ధనలాభము గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టె స్వపుత్రిస్యవివృద్ధిదం
దేహారోగ్యంధనప్రాప్తిం దేవబ్రాహ్మణపూజనం
శనినా సంయుతేదృష్టె శూద్రస్త్రీకలహంతథా
పశుక్షేత్రివినాశంచఆప్తవర్గవినాశనం॥

గురునియొక్క సంబంధవీక్షణమువలన పుత్రిసంతాన వృద్ధియు శరీరసౌఖ్యము ధనలాభము దేవబ్రాహ్మణపూజ యు గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన శూద్రస్త్రీతో కలహాము పశువులు భూమివీటియొక్కయు బంధువులయొక్క యు నాశనమునుగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా దేహాజాడ్యంమనోరుజం
తద్దోషపరిహారార్థం రుద్రజప్యంచకారయేత్
శ్వేతాంగాంమహిషీందద్యాచ్ఛాంతింకుర్యాద్యథావిధిః॥

ద్వితీయసప్తమములయందు శుక్రుడున్న యెడల దేహ జాడ్యము మనోరోగమును గలుగును. అట్టిదోషముపోవుటకై తెల్లనిగోవును గేదెను దానముచేసి యథావిధిగా శాంతిచేసు కున్న యెడల సౌఖ్యముగలుగును.

శుక్రదశలోరవిభుక్తి సం 1

శ్లో॥ శుక్రస్యాంతర్గతేభానౌతృతీయేషష్ఠలాభగే
కళత్రపుత్రసంపత్తింవాహనాంబరభూషణం
రాజమూలాద్ధనాప్తించకీర్తిమాచంద్రతారకం॥

శుక్రదశలో రవిభుక్తియందురవి తృతీయషష్ఠములయం దున్నను లాభమందున్నను కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము వాహనములు వస్త్రములు అలంకారములు రాజమూలకము గా ధనలాభము విశేషకీర్తియు గలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతేభానౌనీచేవాష్టమరిష్ఫగే
స్థానచ్యుతింప్రవాసంచనేత్రరోగంమహద్భయం
పితృనాశంమనోదుఃఖంన్నృపచోరాగ్నిపీడనం॥

యీరవి నీచయందున్నను అష్టమవ్యయములయందు న్నను స్థానభ్రష్టత్వము ప్రవాసము నేత్రరోగము విశేషభ ము పితృనాశనము మనోదుఃఖము రాజులవల్లనుంచిన్ని అగ్ని వల్లనుంచిన్ని దొంగలవల్లనుంచియున్ను బాధయున్ను గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టేమాతృవంశవివృద్ధిదః
ధనధాన్యాంబరప్రాప్తిరిష్టసిద్ధేసుఖీభవేత్॥
కుజేనసంయుతేదృష్టేధాన్యక్షేత్రవినాశనం
సరస్త్రీకలహప్రాప్తింజ్ఞాతీనాంకలహంతథా

చంద్రునియొక్క సంబంధవీక్షణములువలన మాతృవం శవృద్ధి ధనవృద్ధి వస్త్రములు ఇష్టకార్యసిద్ధి సౌఖ్యమును గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన ధాన్యనాశనం భూనాశనము అన్యస్త్రీలతో కలహమును జ్ఞాతివిరోధము యివి గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టేవిద్యాలాభంధనాగమం
బంధూనాముపకారత్వంగృహేకళ్యాణవృద్ధిదం
గురుణాసంయుతేదృష్టేపుత్రప్రాప్తిర్భవిష్యతి
చింతితార్థఫలప్రాప్తిసర్వకార్యనుసిద్ధిదః॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాలాభము ధనలాభము బంధూపకారము గృహమందు శుభకార్యములు జరుగుటయు గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములువలన పుత్రసంతానప్రాప్తియు కోరినవస్తువు లభించుటయు సమస్తకార్యములు నెరవేరుటయు గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టేవాహనక్షేత్రనాశనం
వస్త్రాభరణహానిశ్చస్వస్త్రీవ్యాధిభవిష్యతి॥
శనినాసంయుతేదృష్టేదాసీదాసాదిపీడనం
సమానజనశోకార్తింపితృవర్గవినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనములు భూమియివి నష్టము గలుగుటయు వస్త్రములు ఆభరణములు వీనియొక్క నాశనమును కళత్రమునకు రోగముగలుగుటయుసంభవించును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజనములయొక్క పీడయు సమానమనుజునికొరకు దుఃఖము పితృవర్గనష్టమును గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపిహ్యధికారవివృద్ధిదం
అపూర్వవస్తు సంప్రాప్తిం స్వస్త్రీసుతసుసౌఖ్యదం।
కృషిధాన్యవివృద్ధించ పశువృద్ధింధనాగమం।
సర్వకార్యసుసిద్ధించ దాసీదాసాది సంగ్రహం॥

దశానాథుని లగ్నాయతు రవి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధము గలిగియున్న యెడల ఉద్యోగప్రాప్తి అపూర్వవస్తుసంపాదన పుత్రపుత్రికాసౌఖ్యము వ్యవసాయమువలన ధాన్యవృద్ధియు పశువృద్ధి ధనలాభము సర్వకార్యసిద్ధి దాసీదాసజనవృద్ధి యివి గలుగును.

శ్లో॥ దాయే శాత్షష్ఠరంధ్రే వావ్యయేవా పాపసంయుతే।
స్వస్త్రీవియోగః కలహః ప్రాణహానిభయం భవిష్యతి।
ఆప్తవర్గ విరోధశ్చ సమాన జననాశనం।
కలహోరాజ భీతిశ్చ శత్రుబాధాభవిష్యతి॥

దశానాథునిలగ్నాయతు రవిషష్టాష్ట వ్యయములయందు పాపయుక్తుడైయున్న యెడల స్త్రీవియోగము కలహము ప్రాణభయము ముఖ్యబంధువులతో విరోధము సమానమనుజునియొక్కనష్టము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్తే వాహ్యాపమృత్యుర్భవిష్యతి ।
తద్దోషపరిహారార్థం భాస్కరప్రార్థనం చరేత్ ।
ఛాయాదానం ప్రకుర్వీతశాంతి మాప్నోత్య సంశయః ॥

ద్వితీయసప్తమ స్థానములయందు రవియున్నయెడల అపమృత్యు భయముగలుగును. అట్టిదోషము పోవుటకై సూర్యనారాయణ ప్రార్థనయు ఛాయాప్రతిమాదానమును జేసినయెడల సౌఖ్యముగలుగును.

శుక్రదశలో చంద్రభుక్తి సం 1 మా 8

శ్లో॥ శుక్రస్యాంతర్గతే చంద్రే కేంద్రలాభత్రికోణగే ।
స్త్రీభూమి విద్యాలాభంచ వస్త్రవాహన వైభవం ।
దారాసౌఖ్యాభి వృద్ధించ కృషివాణిజ్య వర్ధనం ॥

శుక్రదశలో చంద్రభుక్తియందు చంద్రుడు కేంద్రకోణముల యందున్నను లాభమందున్నను స్త్రీసౌఖ్యము భూలాభము వస్త్రలాభము వాహనసౌఖ్యముగలుగును. మరియును కళత్రసౌఖ్యము వ్యవసాయవృద్ధి వర్తకలాభము యివిగలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే చంద్రే నీచే షష్ఠాష్టరిఫ్ఫగే ।
ధర్మకర్మ వినాశశ్చ సర్వద్రవ్యవినాశనం ।
దేశాటనందుర్గతిర్వా పౌరోహిత్యంచసేవనం ।
అజ్ఞాతవాస మాప్నోతిదుఃఖంనానావిధంతథా ॥

యీచంద్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయముల యందుగాని యున్నయెడల ధర్మకార్య వినాశనమున్ను సర్వ

ద్రవ్యనాశనమున్ను దేశాటనమున్ను దుర్గతియున్ను పౌరోహిత్యము సేవకావృత్తియున్న అజ్ఞాతవాసమున్ను నానావిధ దుఃఖములున్ను గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే నృపప్రీతిస్సుఖీ భవేత్ ।
వనదుర్గప్రచారశ్చ నేత్రరోగాద్భయంతథా ।
కుజేనసంయుతే దృష్టే శత్రుచోరాదిపీడనం ।
యుద్ధేఖడ్గభయప్రాప్తిః జ్ఞాతీనాంకలహస్తదా ॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులవల్లనుంచి సౌఖ్యమును వనములయందును పర్వతములయందును సంచరించుటయు నేత్రవ్యాధివలన భయమును గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శత్రువులవల్లనుంచి దొంగలవల్లనుంచి భయమున్ను యుద్ధమందు ఖడ్గముచే భయము గలుగుటయు జ్ఞాతులతో విరోధమున్ను గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాలాభోధనాగమం
బంధుకళ్యాణవృద్ధించ చింతితార్థస్యసాధనం
గురుణాసంయుతేదృష్టే సుతలాభంధనాగమం
విప్రప్రభువశాత్సౌఖ్యం ధనధాన్యవివృద్ధిదం

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాలాభము ధనలాభము బంధుకళ్యాణము ప్రయత్నము చేయబడిన వస్తుసంప్రాప్తి యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రలాభము

ధనలాభము విప్రప్రభువల్లనుంచి సౌఖ్యమును ధనధాన్యాభి వృద్ధియు గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టె స్వస్యకళ్యాణశోభనం
యానవాహనసంప్రాప్తిం పుత్రస్త్రీసౌఖ్యమేవచ
శనినాసంయుతేదృష్టే దాసీదాససుతక్షయం
క్షేత్రధాన్యవినాశంచ శూద్రాణాంకలహంతథా

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన తనయొక్క వివాహాది కల్యాణమహోత్సవములును పల్లకీవాహనము మొదలగువాని సంప్రాప్తియు పుత్రస్త్రీసౌఖ్యమును గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసీదాస జననష్టము సంతాననష్టము భూనష్టము ధాన్యనాశనము శూద్రులతో కలహమును గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
శుభగ్రహయుతేవాపి ధాన్యవృద్ధింధనాగమం
వివాహశుభసంప్రాప్తిం మిత్రస్త్రీసౌఖ్యవృద్ధిదం
మిత్రప్రభువశాత్సౌఖ్యం రాజ్యప్రాప్తింయశోదయం
యుద్ధేశత్రువినాశస్స్యాత్పూర్వవారేరాజదర్శనం

దశానాథుని లగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల ధాన్యలాభము వివాహాది శుభకార్యములు జరుగుటయు మిత్రులయొక్కయు కళత్రముయొక్క సౌఖ్యము మిత్రప్రభువల్లనుంచిసౌఖ్యము రాజ్యప్రాప్తి శుభము యుద్ధ

మందు శత్రునాశనము గలుగుటయు సోమవారమునాడు రాజ దర్శనమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే
ధననాశంమనస్తాపం బంధుమిత్రాదివిగ్రహం
అపకీర్తిభయంచైవ పరస్త్రీకలహంతథా

దశానాథుని లగాయతు చంద్రుడు షష్ఠాష్టవ్యయముల యందున్నయెడల ధననాశనము మనస్తాపము బంధుపీడమిత్ర నష్టము అపకీర్తిభయము పరస్త్రీలతో కలహము అకాలభోజనము సమస్తజనులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా హ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీజపంచరేత్
మృగదానంప్రకుర్వీతరోగశాంతింప్రయచ్ఛతి

ద్వితీయసప్తమ స్థానములయందు చంద్రుడున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై మృగదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

శుక్రమహాదశలో కుజభుక్తి సం 1 మా 2

శ్లో॥ శుక్రస్యాంతర్గతే భౌమే తృతీయే షష్ఠలాభగే
స్వోచ్చేవా శుభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
స్ఫోటకం వ్రణభీతిశ్చ శీఘ్రమేవవినాశనం.
భూలాభం ధనలాభం చ రాజమూలాత్ప్రవేశతః॥

శుక్రదశలో కుజభుక్తియందు కుజుడు తృతీయషష్ఠము ములయందుగాని లాభమందుగాని ఉచ్చయందుగాని శుభగ్ర

హాసంబంధములు గలిగియున్న యెడల స్ఫోటకమున్ను వ్రణ మున్ను గలిగి తత్క్షణము నివారించుటయు భూలాభము ధనలా భము రాజమూలకముగా ధనలాభమును గలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే భౌమే నీచే వాష్టమరిప్ఫగే
కళత్రపుత్రహానిశ్చ పాపమూలా ద్ధనవ్యయం
శత్రువృద్ధిర్విశేషంచ పితార్జితధనవ్యయం
స్థానచ్యుతిం ప్రవాసంచ గృహక్షేత్ర వినాశనం॥

కుజుడు నీచయందుగాని అష్టమవ్యయములయందుగాని యున్నయెడల కళత్రనష్టము పుత్రనష్టము పాపమూలకముగా ధనవ్యయము శత్రువృద్ధి పితార్జితధనము వ్యయమగుటయు స్థానభ్రష్టత్వము ప్రవాసశిక్షయు గృహక్షేత్ర వినాశనమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే స్ఫోటకజ్వరపీడనం
అతిసారాదిరోగంచ బుద్ధిభ్రంశం ధనవ్యయం
చంద్రేణసంయుతే దృష్టే క్షీరాన్నాది సుభోజనం
అశ్వవాహనసంప్రాప్తి యత్నకార్యార్థసిద్ధిదం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన స్ఫోటకము జ్వర బాధ అతిసారమువలన రోగము బుద్ధిమాంద్యము ధనవ్యయ మును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన క్షీరాన్న భోజనము అశ్వవాహన సంప్రాప్తియు యత్నకార్యసిద్ధియు గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బాంధవానాం విరోధతః
వ్యాపారే ధనహానిస్స్యాన్మాతులాది వినాశనం
గురుణాసంయుతేదృష్టే దేహసౌఖ్యం ధనాగమం
స్వాధికార వివృద్ధించ హ్యపూర్వ ప్రియదర్శనం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువులతో విరోధము వ్యాపారమందు ధననష్టము మేనమామలయొక్క నష్టమున్ను గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన శరీరసౌఖ్యము ధనలాభము ఉద్యోగప్రాప్తి అపూర్వ ప్రియదర్శనమును గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే గృహేకళ్యాణశోభనం
యానవాహనసంప్రాప్తి మధికారవివృద్ధిదం
శనినాసంయుతేదృష్టె దాసీదాసవిరోధకృత్
వాతరోగాది బాధాచ సర్వత్ర కలహస్తథా॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన గృహమందు కళ్యాణవైభవములున్ను వాహనము పల్లకీమొదలగువాని సౌఖ్యమును ఉద్యోగప్రాప్తియు గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసీదాసజనములతో విరోధము వాతరోగమువలన బాధయు సమస్తజనులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాతృతీయే లాభగేపివా
లాభేవాషష్ఠరాశిస్థే శుభగ్రహయుతేపివా

వివాహంసుతసౌభాగ్యం దారాసౌఖ్యం తథైవచ
పశువాహనవృద్ధించ ధాన్యసంగ్రహణం తథా
యుద్ధేషు జయమాప్నోతి గృహారామాదివర్ధనం
విచిత్రవస్తుసంప్రాప్తిం సర్వకార్యసుసిద్ధిదం॥

దశానాథునిలగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని షష్ఠమమందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల వివాహము పుత్రసౌఖ్యము సౌభాగ్యము కళత్రసౌఖ్యము పశువులు వాహనము వీనియొక్క వృద్ధి ధాన్యలాభము యుద్ధమందు జయము గృహములు వనములు మొదలగువానియొక్క వృద్ధి విచిత్రమైన వస్తువులు సంపాదించుటయు సర్వకార్యసిద్ధియు గలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేరాశౌ హ్యష్టమేపాపసంయుతే
భ్రాతృభిః కలహశ్చైవశత్రువృద్ధిర్భవిష్యతి
వ్రణశస్త్రాది బాధాచ జ్వరరోగాది పీడనం॥
సమాన జనశోకార్తిం స్థాననాశం నృపాద్భయం॥

దశానాథునిలగాయతు అష్టమవ్యయములయందు కుజుడు పాపులతో గలిసియున్నయెడల సోదరులతో విరోధము శత్రువద్ధి వ్రణమువల్లనుంచిగాని శస్త్రమువల్లనుంచిగాని భయము జ్వరరోగమువల్లనుంచి బాధయున్ను సమానమనుజునియొక్క కష్టము స్థానభ్రష్టత్వము రాజులవలన భయమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే హ్యాపమృత్యుర్భయంతథా
తద్దోషపరిహారార్థం స్కందపూజాం సమాచరేత్
అనడ్వాహం ప్రకుర్వీత శాంతిమాప్నోత్య సంశయః

ద్వితీయసప్తమస్థానములయందు కుజుడున్న యెడల మరణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై స్కందపూజయు యెద్దుదానమును చేసినయెడల శాంతిగలుగును.

శుక్రమహాదశలో రాహుభుక్తి సం 3

శ్లో॥ శుక్రస్యాంతర్గతే రాహౌ తృతీయే షష్టలాభగే
ఉద్యోగలాభం సౌఖ్యంచ ధనధాన్యాభివర్ధనం
విదేశయానలాభంచ ధనవాణిజ్య వర్ధనం॥

రాహువు తృతీయమందుగాని షష్ఠలాభములయందుగాని ఉన్నయెడల ఉద్యోగలాభము సౌఖ్యము ధనధాన్యాభివృద్ధి విదేశప్రయాణమువలన ధనలాభము వర్తకవ్యాపారాభివృద్ధియును గలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే రాహౌవ్యయేవాష్టమసంయుతే
కేంద్రే వాకోణసంస్థేచ పాపగ్రహయుతేక్షితే
ఉద్యోగభంగం దేహార్తిం మాతృపితృ వినాశనం
దారాపుత్రాది పీడాచ ఋణశత్రువివర్ధనం॥

శుక్రునిలో రాహువు అష్టమవ్యయములయందుగాని కేంద్రకోణములయందుగాని పాపగ్రహయుక్తుడై యున్నయెడల ఉద్యోగభంగము దేహపీడ మాతృపితృవినాశనము భార్యాపుత్రులయొక్క పీడయు ఋణము శత్రువృద్ధి యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోవ్యాధి భయంతథా
చిత్తవైకల్యబుద్ధించ నృపాలాద్ధననాశనం
చంద్రేణసంయుతేదృష్టే మాతృవంశ వినాశనం
అకాలభోజనప్రాప్తిం స్వభార్యాయాం విరోధతా

రవియొక్క సంబంధవీక్షణములవలన శిరోవ్యాధి భయము బుద్ధిచాంచల్యము రాజులవల్లనుంచి ధననష్టమును గలుగును.
చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశనాశనము అకాలభోజనము స్వభార్యతో కలహము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే సోదరక్షేత్ర నాశనం
వివాదయుద్ధే తిభయం శిరోరోగమతిభ్రమం
బుధేనసంయుతేదృష్టే బాంధవానాం భయంభవేత్
స్వజాతికలహాద్బాధాంధనం సర్వంవినాశనం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన సోదరులయొక్కయు భూమియొక్కయు నాశనమును వివాదము యుద్ధమందు భయము శిరోరోగము మతిచాంచల్యమును గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే దారాపుత్రాదినాశనం
సమానజనశోకార్తి మానభంగం మతిభ్రమం
శుక్రేణసంయుతేదృష్టే హ్యాశ్వేభ్యః పతనంభవేత్
వస్త్రభూషణహానించ బంధుమిత్ర విరోధకృత్॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన భార్యాపుత్రులయొక్క నష్టము సమానమనుజునియొక్క శోకము మానభంగము మతిభ్రమణము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన అశ్వములు మొదలగువాని నష్టము వస్త్రములు భూషణములు వీనియొక్క నష్టము బంధుమిత్రులతో విరోధము యివిగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే వాతరోగాదిపీడనం
సమానజనశోకార్తిం పుత్రదారాది నిగ్రహం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన వాతరోగమువలన పీడయు సమానమనుజునియొక్క శోకము దారాపుత్రపీడ యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర గేరాహౌ త్రికోణే షష్ఠలాభగే
అయత్నకార్య సిద్ధిశ్చ సర్వశత్రువినాశనం
కృషిధాన్యాదివృద్ధిశ్చ సుతలాభోభవిష్యతి
స్వప్రభోస్తు మహాత్సౌఖ్యం స్వస్థాన ప్రాప్తిరుచ్యతే
అపూర్వవస్తుసం ప్రాప్తి బాంధవ ప్రియదర్శనం
యత్నకార్యార్థసిద్ధిశ్చ హ్యారోగ్యం నృపపూజ్యతా

దశానాధునిమొదలు రాహువు కేంద్రకోణములయందుగాని షష్ఠలాభములయందుగాని వున్నయెడల ప్రయత్నము

లేకుండ కార్యసిద్ధియు సమస్తశత్రువులయొక్కయు నష్టము వ్యవసాయవృద్ధి ధాన్యలాభము పుత్రలాభము స్వప్రభువువల్ల నుంచి సౌఖ్యము స్వస్థానప్రాప్తి యివిమొదలగు సౌఖ్యములు అపూర్వవస్తువస్తుసంపాదనయు బంధువులదర్శనము కార్యసిద్ధి ఆరోగ్యము రాజపూజ్యత యివిగలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేవాపి హ్యష్టమేపాపసంయుతే
తద్భుక్తౌ మానభంగంచ మిత్రబంధు విరోధతా
అశుభంలభతేకర్మ పితృమాతృ వినాశనం॥

దశానాథుని లగాయతు అష్టమవ్యయముల యందు పాపగ్రహసంబంధము రాహువునకు గలిగియున్న యెడల ఆభుక్తి. యందు మానభంగము మిత్రులతోను బంధువులతోను విరోధము అశుభకర్మచేయుటయు పితృమాతృ వినాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్
మహాకూష్మాండ దానేనశాంతి మాప్నోత్యసంశయః॥

ద్వితీయసప్తమస్థానములయందు రాహువున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై దు

ర్గా దేవీజపమును పెద్దగుమ్మిడికాయదానమును చేసినయెడల శాంతిగలిగి సౌఖ్యమును బొందును.

శుక్రదశలో గురుభుక్తి సం 2 మా 8

శ్లో॥ శుక్రస్యాంతర్గతే జీవేస్వోచ్చేవా కేంద్రకోణగే
ధనేవాలాభరాశిస్థే శుభగ్రహాయుతేక్షితే
వాహనంబంధుసన్మానంయజ్ఞం వైవాహికం శుభం
దారాపుత్రాదిసౌఖ్యంచ కుటుంబస్యాభివర్ధనం

గురుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ధనలాభములయందుగాని శుభగ్రహాయుక్తుడై యున్న యెడల వాహనము బంధుసన్మానము యజ్ఞము వివాహాది శుభకార్యములు భార్యాపుత్రులయొక్క సౌఖ్యము కుటుంబ వృద్ధి యివిగలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే జీవే నీచేవాష్టమరిప్ఫగే
కృషిగోభూమినాశంచ విరోధంబంధుభిస్సహ
స్వకులాగారహీనంచ పరదారాభిమర్శనం
భూమివాదం మనోదుఃఖంధర్మమూలాద్ధనవ్యయం॥

శుక్రదశలో గురుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయము లయందుగాని ఉన్నయెడల వ్యవసాయనష్టము భూనాశనము

బంధువిరోధము స్వకులాచారహీనుడును పరదారాసక్తుడును భూసంబంధమగు వ్యాపారచిక్కులున్ను మనోదుఃఖమున్ను ధర్మమూలకముగా ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే నృపమూలాత్సుఖీభవేత్
స్వస్వగ్రామాధిపత్యంచ తీర్థస్నానాదలాభవాన్
చంద్రేణ సంయుతే దృష్టే వాహనాదివివృద్ధిదం
భూషణాంబర సంప్రాప్తిం స్త్రీమూలాద్ద్రవ్యలాభకృత్॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులవలన ధన లాభము గ్రామాధికారము తీర్థయాత్రలు మొదలగువాని భయముగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహన యోగము అలంకారములు వస్త్రములు స్త్రీమూలముగాధన లాభముకలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేభూమిలాభంచధాన్యవాన్
భూషణాదికలాభాంశ్చవాహనాంబరలాభకృత్
బుధేనసంయుతేదృష్టేబంధుసన్మానమేవచ
దారాపుత్రాదిసౌఖ్యంచవాణిజ్యేధనలాభవాన్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన భూలాభము

ధనలాభము అలంకారలాభము వాహనము వస్త్రలాభము మొదలగునవికలుగును.

బుధునియొక్క సంబంధ వీక్షణములవలన బంధుసన్మానము దారాపుత్రాదులవలన సౌఖ్యము వర్తకమున ధనలాభము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీముఖాద్ధనలాభవాన్
తీర్థస్నానాదిలాభంచ స్వప్రభోశ్చసుఖీభవేత్
శనినాసంయుతేదృష్టే దారాపుత్రాదినాశనం
బంధుహానిశ్చకష్టంచ సమానజననాశనం

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీముఖముగా ధనలాభము తీర్థస్నానలాభము స్వప్రభువువలన సుఖమును గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దారాపుత్రాదులకు నాశనము బంధుహాని కష్టములు సమానజనుని నాశనము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రగేలాభేత్రికోణేవాతృతీయగే
శుభగ్రహయుతేవాపిహ్యర్థలాభముదీరయేత్ ॥
యుద్ధేశత్రువినాశశ్చబుద్ధిర్వ్యాయతి స్తథా
స్వప్రభోస్తుమహాత్సౌఖ్యంశివపూజాదితత్పరః

వ్యవసాయాభివృద్ధిశ్చనానామూలాద్ధనాగమః
అ_త్తప్రభువశాత్సౌఖ్యంవిద్యా వృద్ధిర్భవిష్యతి॥

దశానాధునిలగాయతు గురుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహాయుతుడై యున్న యెడల అర్థలాభము యుద్ధమందు శతృనాశనము ఋణద్రవ్యము లభించుటయు స్వప్రభువువల్లనుంచి సౌఖ్యమును శివపూజచేయుటయు వ్యవసాయవృద్ధి అనేకవైపుల నుంచి ధనలాభము గలుగుటయు యిష్టప్రభుమూలముగాసౌఖ్యము విద్యాభివృద్ధియు గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయే వా పాపసంయుతే
గురుద్వేషం కార్యహాంనిసమానజననాశనం
దేశాద్దేశాంతరేభీతింకలహాంసము పేష్యతి
యత్న కార్యవినాశంచబంధుమిత్రాదిపీడనం॥

దశానాధుని లగాయతు గురుడు షష్ఠాష్టవ్యయముల యందున్న యెడలను పాపులతో గలిసినను గురుద్వేషముకార్యభంగము సమానజననాశనము విదేశములయందు భయము గలుగుట కలహము కార్యనాశనము బంధుమిత్రాదిపీడయివి గలుగును.

శ్లో॥ ద్వితీయస_ప్తమస్థేవావ్యామృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంరుద్రజప్యంవినిర్దిశేత్
స్వర్ణగర్భితకూష్మాండదానేనారోగ్యమావిశేత్॥

ద్వితీయసప్తమములయందు గురువున్నయెడల అప మృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై రుద్రజప మును బంగారమునుంచబడిన పెద్దగుమ్మడికాయ దానమును చేయవలెను.

శుక్రదశలో శనిభుక్తి సంవత్ మా౦2

శ్లో॥ శుక్రస్యాంతర్గతే మందే తృతీయేషష్ఠలాభగే
శత్రునాశంమనోత్సాహం ధనధాన్యవివర్ధనం
స్వబంధుదారపుత్రాణామారోగ్యం భూషణాదికం
భృత్యమిత్రార్థసంపత్తిర్లభతేకర్మసంగ్రహం

శుక్రదశలో శనితృతీయషష్ఠలాభముల యందున్నయె డల శత్రునాశనము మనోత్సాహము ధనధాన్యాభివృద్ధియు బంధువులయొక్కయు భార్యాపుత్రులయొక్కయు ఆరోగ్యము అలంకారప్రాప్తి మిత్రదాసీదాసజన వృద్ధియు శుభకర్మయు మొదలగుమంచిఫలములు గలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతేమందే నీచేవాష్టమరిష్ఫగే
కేంద్రేవాకోణసంస్థేచ పాపగ్రహయుతేక్షితే
పరప్రేష్యంమనోదుఃఖం గుల్మశూలాదిపీడనం
స్థానచ్యుతింప్రవాసంచ నీచమూలాద్ధనవ్యయం

శుక్రదశలో శనినీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని యున్నను కేంద్రకోణముల యందున్నను పాపగ్రహములతో గలిసినను పాపగ్రహములచే చూడబడినను

కళత్రము సంతానము బంధువులు వీరియొక్క నాశనము కర్మ నాశనము సేవకావృత్తి మనోదుఃఖము గుల్మశూలవలన బాధయు స్థానభ్రష్ఠత్వము పరదేశనివాసము పాపమూలకముగా ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పదభ్రంశంధనక్షయం
యుద్ధేశత్రుభయంచైవ సర్వత్రకలహంతథా
శనినాసంయుతేదృష్టే మాతృవంశవినాశనం
స్త్రీమూలాద్ధననాశస్స్యాత్ స్థానాశనాశస్తథైవచ

రవియొక్క సంబంధవీక్షణములవలన పదభ్రష్టత్వము ధననాశనము యుద్ధమందు శత్రుభయము సకలజనులతోకలహమును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలనమాతృవంశనాశనము స్త్రీమూలకముగాధననష్టముస్థాననాశనమునుగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే భ్రాతృభిఃకలహంతథా
క్షేత్రధాన్యవినాశంచఋుణశస్త్రాదిపీడనం॥
బుధేనబుద్ధిహీనశ్చ పాపచింతాతతో భవేత్
మిత్రబంధువిరోధస్స్యాదకస్మాద్భయమావిశేత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన సోదరులతోకలహముభూనాశనముధాన్యనాశనము ఋణముశత్రుపీడగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలనబుద్ధిహీనతపాపచింతబంధుమిత్రవిరోధముఅకస్మాత్తుగా కలహమునుగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుద్వేషస్తథైవచ
పరాపవాదనిందాచకలహశ్చభవిష్యతి॥

శుక్రేణసంయుతేదృష్టేస్వస్త్రీవ్యాధిర్భవిష్యతి
నీచారిజనసంసర్గఃవాహనాదిపశుక్షయః॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురుద్వేషము పరాపవాదము నిందకలహము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన భార్యకురోగముగలుగుటనీచులతోస్నేహము వాహననష్టమును గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయేలాభగేపివా
శుభగ్రహయుతేవాపివిత్తలాభముదీరయేత్
ధాన్యార్థపశువృద్ధిస్స్యాద్భృత్యవర్గాత్సుఖీభవేత్
అపూర్వవస్తుసంప్రాప్తింబాంధవప్రియమాదిశేత్

దశానాథునిలగాయతు శని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల ధనలాభము ధాన్యలాభము పశులాభము భృత్యవర్గమూలకముగా సౌఖ్యమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవా నీచరాశిగే
కలహం ధాన్యనాశంచ స్వాధికార వినాశనం
సర్వత్ర జనవిద్వేషం శూద్రాణాం కలహంతథా॥

దశానాథునిలగాయతు శని షష్ఠాష్టవ్యయములయందు పాపగ్రహసంబంధములు గలిగియున్నను నీచయందున్నను కలహము ధాన్యనాశనము ఉద్యోగనష్టము సను స్వజనులతో ద్వేషము శూద్రులతో కలహము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మహిషీ దానమాచరేత్॥

ద్వితీయసప్తమములయందు శనియున్నయెడల అపమృ

త్యదోషము గలుగును. అట్టిదోషము పోవుటకై గోదెదాన మును చేసిన సౌఖ్యము గలుగును.

శుక్రదశలో బుధభుక్తి సం 2 మా 10

శ్లో॥ శుక్రస్యాంతర్గతే సౌమ్యే కేంద్రలాభత్రికోణగే
రాజపూజ్యం యశోవృద్ధిం వాణిజ్యేన ధనాగమం
విద్యాజయం నృపాత్ప్రీతిం పురాణ శ్రవణాదికం॥

శుక్రదశలో బుధభుక్తియందు బుధుడు కేంద్రకోణ ములయందుగాని లాభమందుగాని బలవంతుడై యున్న యెడల రాజ్యపూజ్యతయశస్సువర్థకమునందు ధనలాభమువిద్యయందు జయము రాజసన్మానము పురాణకాలక్షేపన యివిగలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే సౌమ్యే నీచేవాష్టమరిష్ఫగే
శతృవృద్ధిర్విశేషంచ జ్ఞాతిమూలాద్ధనవ్యయం
పదభ్రష్టంమహాద్వేషం వ్యాపారేణ ధనవ్యయం॥

శుక్రదశలో బుధుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయ ములయందుగాని యున్న యెడల శతృవృద్ధి జ్ఞాతిమూలకముగా ధనవ్యయము పదభ్రష్ఠత్వము విశేషద్వేషము వ్యాపారమందు ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పైత్యరోగం భయంతథా
జ్వరాతిసారకష్టాది పితృవర్గ వినాశనం
చంద్రేణసంయుతేదృష్టే అశ్వాద్యారోహణంతథా
సమానబంధు సన్మానం మణివస్త్రాది సంగ్రహం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పైత్యరోగము భయము జ్వరాతిసారముకష్టము పితృవర్గనాశనమునుగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన అశ్వమును

యెక్కి సంచరించుటయు సమానబంధుసన్మానము మణులు వస్త్రములు వీటియొక్క లాభము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే రుణరోగాది పీడనం
సహోదరాదినాశంచ స్వస్త్రీ గర్భవినాశనం
గురుణాసంయుతేదృష్టె సుతలాభం ధనాగమం
దేహారోగ్యం కీర్తిలాభం గురుదేవద్విజార్చనం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన రోగభయము సోదరనష్టము భార్యకు గర్భస్రావరోగము యివి గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రలాభము ధనలాభము దేహారోగ్యము కీర్తి దేవబ్రాహ్మణ గురువులయొక్క పూజయు గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టె కావ్యాలంకార సంగ్రహం
గానవిద్యారతోనిత్యం గృహే కళ్యాణవైభవం
శనినాసంయుతేదృష్టె చతుష్పాజ్జీవనాశనం
సమానజనశోకంచ మానహానిం తథైవచ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన కావ్యాలంకార సంగ్రహము గానవిద్య గృహమందు కళ్యాణవైభవము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలనపశునష్టము సమానమనుజునియొక్క శోకము మానభంగము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణే వాతృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపి ధనలాభము దీరయేత్
వాహనం భూమిలాభంచ యత్న కార్యార్థ సిద్ధిదం
వివాహాది శుభప్రాప్తిం దూరాదాహ్వాన పత్రికా

ధాన్యసంగ్రహణంచైవ ఋణద్రవ్యా యతింతథా
కృషిమూలాద్ద్రవ్యలాభం మిత్రప్రభువ శాత్సుఖం॥

దశానాథునిలగాయతు బుధుడు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల ధనలాభము వాహనలాభము భూలాభము యత్నకార్యసిద్ధి వివాహాది శుభప్రాప్తి దూరదేశమునుంచి అహ్వానపత్రిక వచ్చుటయు ధాన్యలాభము ఋణద్రవ్యము తిరిగివచ్చుటయు వ్యవసాయమూలకముగా ధనలాభము మిత్రప్రభువుల్లనుంచి సౌఖ్యము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్టగే రంధ్రేవ్యయేవా పాపసంయుతే
కలహం రాజకోపంచ బంధుద్వేషం మనోవ్యథాం
ఆప్తబంధు వినాశంచ ఋణరోగాదిపీడనం
పుత్రవర్గాదికలహం సర్వకార్య వినాశనం॥

దశానాథునిలగాయతు బుధుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపగ్రహసంబంధములు గలిగియున్నయెడల కలహము రాజవిరోధము బంధువిరోధము మనోవ్యాకులత ముఖ్య బంధువునియొక్క మరణము ఋణరోగము వీనివలనబాధ పుత్రులతో కలహము సర్వకార్యనాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యప మృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం విష్ణుపూజాం సమాచరేత్
లక్ష్మీనారాయణందానం కుర్యాత్తద్దోషశాంతయే॥

ద్వితీయ సప్తమస్థానములయందు బుధుడున్నయెడ అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై వి[illegible] పూజ చేయుటయు లక్ష్మీనారాయణ ప్రతిమదాన[illegible] చేయ

టయు వీనివలన శాంతిగలుగును.

శుక్రదశలో కేతుభుక్తి సం 1 మా 2

శ్లో॥ శుక్రస్యాంతర్గతే కేతౌతృతీయే షష్ఠలాభగే
వాహనం భూమిలాభంచ స్వబంధు జనపూజ్యతాం
పరోపకారం సర్వేషాం ధర్మచింతాభివర్ధనం॥

కేతువు తృతీయషష్ఠలాభములయందున్న యెడల వాహనము భూమి బంధుపూజ్యత యివిగలుగుటయు పరోపకారము ధర్మకార్యములు చేయుటయందిచ్ఛ యివిగలుగును.

శ్లో॥ శుక్రస్యాంతర్గతే కేతౌవ్యయేవాష్టమసంస్థితే
పుత్రమిత్రాదిపీడాచ దుస్సంగం ప్రాప్నుయాత్క్వచిత్
ఉద్యోగభంగం దుఃఖంచ ఋణశత్రు వివర్ధనం॥

శుక్రదశలో కేతువు వ్యయమందుగాని అష్టమమందు గాని వున్నయెడల పుత్రులయొక్కయు మిత్రులయొక్కయు పీడగలుగుట దుస్సంగతిగలుగుట ఉద్యోగభంగము ఋణశత్రు వృద్ధి యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే కలహం దేహతాపకృత్
చంద్రేణసంయుతేదృష్టే మాతులాదివినాశనం
వస్త్రభూషణహానించ వ్యవహారేధనక్షయం.
కుజేనసంయుతేదృష్టే కలహశ్చోరాద్భయంతథా
సమానజనశోకంచవిత్తనాశం నృపాద్భయం
బుధేనసంయుతేదృష్టే బంధుభిఃకలహంతథా
ఋణద్రవ్యంమానహానిం స్థానవిచ్యుతిమేవచ
గురుణాసంయుతేదృష్టే పుత్రదారాదినిగ్రహం
దేహతాపంమహత్కష్టం దుష్కర్మఫలసిద్ధిదం

శుక్రేణసంయుతేదృష్టే స్వస్త్రీగర్భవినాశనం
స్త్రీమూలాద్ధననాశంచ శయ్యాసౌఖ్యాదినాశనం
శనినాసంయుతేదృష్టే స్వభృత్యకలహాంతథా
నీచసేవామహత్కష్టం సమానజననాశనం

రవియొక్కసంబంధము వలన కలహమున్ను దేహతాపమున్ను గలుగును.

చంద్రునియొక్క సంబంధ వీక్షణములవలన మేనమామయొక్క నష్టము వస్త్రములు భూషణములు వీనియొక్క నష్టము వ్యవహారమందు ధననష్టమును గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన కలహముదొంగలవలనభయము సమానమనుజుని గురించి విచారము ధననష్టము రాజులవలన భయమును గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువులతో కలహము ఋణము మానభంగము స్థానభ్రష్టత్వము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రులు భార్యవీర్యయొక్క నష్టము శరీరతాపము విశేషకష్టము దుష్కర్ములు చేయుటయు యివిగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన భార్యయొక్క ప్రవదోషము స్త్రీమూలకముగా ధనవ్యయము శయ్యాసౌఖ్యము లేకపోవుట యివిగలుగును.

శనియొక్కసంబంధమువలనభృత్యులలో కలహమునీచసేవ విశేషకష్టము సమానమనుజునియొక్క నష్టము యివిగలుగును

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణే వాదుశ్చిక్యేలాభ గేపివా
షష్ఠేవాశుభసంయుక్తే ధనలాభముదీరయేత్

స్త్రీసౌఖ్యంపుత్రవృద్ధించ యత్నకార్యసుసిద్ధిదం
గృహేకళ్యాణవృద్ధించ చతుష్పాజ్జీవలాభకృత్॥

దశానాథుని లగాయతు కేతువు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని షష్ఠమునందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల ధనలాభము కళత్రసౌఖ్యము పుత్రవృద్ధి యత్నకార్యసిద్ధి గృహమందు కళ్యాణము పశులాభము యివిగలుగును.

శ్లో॥ దాయేశాష్టమరాశౌవావ్య యేవాపాపసంయుతే
స్త్రీవివాదంధారనాశం మానభంగంతథైవచ
అప్రభూపాద్భయ ప్రాప్తింస్థాననాశంతథైవచ॥

దశానాథుని లగాయతు కేతువు అష్టమవ్యయముల యందు పాపయుక్తుడై యుండినయెడల స్త్రీలతోవైరమున్ను కళత్రవియోగము మానభంగమున్ను అప్రభుడైన రాజువలన భయమున్ను స్థానచలనము గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థే వాహ్యాపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్
ఛాగదానంప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకః॥

ద్వితీయసప్తమస్థానములయందు కేతువున్నయెడల అప మృత్యుభయము గలుగును. అట్టిదోషముపోవుటకై మృత్యుంజయజపమును మేకదానమును జేసినయెడల సౌఖ్యము గలుగును.